*Iyadat se Tajeyyat thak (Telugu)*

# మరణం నుండి మట్టిపాలయ్యేదాకా

మూలం
నావిక్ హంజాపూరి

అనువాదం
డాక్టర్ బద్దేలి

# విషయసూచిక

## అనువాదకుని ఆవేదన

ఒక ముస్లిం వారానికొక ముస్లింకు ఒక్కో సుగుణాన్ని నేర్పగలిగితే కొద్ది సంవత్సరాలలోనే ముస్లింలందరూ సంపూర్ణ మోమినులు అవుతారు. రోజుకో ఇస్లామీయ ఆచారాన్ని తెలుసుకొని కనీసం సగటున ఒక్క ఆచరణని చదివి, లేక విని ఆచరిస్తే త్వరలో ప్రపంచమెల్లా ప్రవక్త(స) గారి మదనీ జీవితకాలపు ఉత్తర భాగం (హిజ్రీ 5వ సం॥ మొదలు 10వ సం॥వరకు) లోని ముస్లింల జీవితంలా ప్రపంచ జనబాహుళ్యమంతటా సుఖజీవనం ఇట్టే ప్రాప్తిస్తుంది. ఇస్లామంటే- మానవ జీవన సరళి గదా? ఇంతెందుకు? మనం వింటున్న ఖుర్ఆన్ సూక్తులు, హదీసుల ఆదేశాలను విన్నప్పుడల్లా ఒక్కొక్కటి అమలుపర్చుకుంటూ పోతే చాలు. సంవత్సరానికి 360 ఇస్లామీ సుగుణాలు మనలో ఉన్నట్లే.

ప్రతి జుమా నమాజుకు ముందు జరిగే ప్రసంగాలలో వినే ఉపదేశాలను గనక మనం విని, వాటిని మన నిత్యజీవితంలో అమలు పరుస్తూపోతే ఓ ఏడాదిలో దాదాపు మరో మూడువందల పైచిలుకు మతపర విషయాలు మనకు తెలుస్తాయి. అలా 15సం॥ల ఒక బాలుడు తన 20ఏండ్ల లోపల పదిహేను వందల ముత్యాల్లాంటి సుగుణాలను తన స్వంతం చేసుకోవచ్చు జీవితమంతా వింటూ అమలుపర్చుకుంటూపోతే పుణ్యానికి పుణ్యాలు- పులుగడిగిన ముత్యాలుగల ముస్లింలవటం ఖాయం. నేను ఉర్దూ అరబీలు తప్పనిసరిగా చదవటం, రాయటం నేర్చుకోండి అనటంలేదు. 'తీరుబాటు ఎక్కడిది?' అనే జవాబు వస్తుంది. నేర్చుకుంటే మంచిదే. కేవలం ధ్యాసపెట్టి వినండి అంటున్నాను. విన్నది అమలుపర్చండి' అని బ్రతిమాలుకుంటున్నాను. మరి శాశ్వతమైన, అనంతమైన గొప్ప స్వర్గం కావాలంటే 'ఈ కాస్తా ప్రయత్నం కూడా చేయలేను' అంటే ఎలా?

ఇస్లామీయ పత్రికలు ఆరంభించినప్పటినుండి నా వ్యాసాలు, కథలు, కవితలు, ఉపన్యాసాలు గీటురాయి వార, మాస పత్రికలలోనూ, ఇతర వార,

మాస, త్రైమాసిక పత్రికలలోనూ ముద్రింపబడుతున్నాయి. ఇందుకు ఆయా పత్రికల యాజమాన్యాలకు కృతజ్ఞతలు. నేను పంపే ప్రతి ఆర్టికల్‌కు ముందుగా దాదాపు పదిసార్లు అయినా విచ్చుకలం చేతబట్టి చదువుతాను. ఏదైనా తప్పు, పొరపాటు ఉందేమో చూసుకుంటాను. అవసరమనిపిస్తే మౌల్వీలను సంప్రదించి సందర్భోచితంగా నప్పే ఖుర్ఆన్, హదీసులను జోడిస్తాను. ఫలితంగా అభిమానుల ఫోన్లు, ఉత్తరాలు అందుకుంటున్నాను. ఈ సందర్భంలో గీటు రాయి ఎడిటోరియల్‌కు కృతజ్ఞతలు తెలుపక ఉండలేకపోతున్నాను.

ఇటీవల గీటురాయి యాజమాన్యం నాపేర మూడు ఉర్దూ భాషలో ముద్రింపబడిన చిరు పుస్తకాలను తర్జుమా చేయమని పంపారు. నాకు సంతోషం కలిగింది. అంతకన్నా ఎక్కువ భయం పట్టుకుంది, గుండె వణికింది. కారణం- ఇంత గొప్ప రచనలను అనువదించడం నా వల్ల అవుతుందా? అని. కళ్ళు చూపులు తగ్గుతున్నా, ఏడు పదుల వయస్సులో, ఫోన్ నంబర్లే గుర్తుండని ఈ అల్పజ్ఞానిని; సెల్‌ఫోన్‌ను సక్రమంగా వినియోగించు సంపూర్ణ జ్ఞానమేలేని అల్పజ్ఞానంగలవాణ్ణి, నావల్ల ఇంతపెద్ద పని అవుతుందా? ఏదో... వయసులో ఉన్నప్పుడు ఉర్దూ ఇంగ్లీషులనుండి తర్జుమాలు చేస్తే చేసివుండవచ్చు, అవి ముద్రింపబడి వుండనూవచ్చు. కానీ ఇపుడు ఏకంగా.... ఐతే ఇప్పుడు గీటు రాయివారి ప్రోత్సహం నాకు అండగా వుంది. సాధారణ ముస్లింలకు తెలుగు భాషలో సర్వసాధారణ విషయాలు తెలియబరచటానికి లభించిన ఈ అవకాశాన్ని వదులుకోవటం అవివేకం అవుతుంది. అనుకోని ధైర్యం చేసి ముందడుగు వేశాను.

ఉర్దూ నుండి తెలుగు, ఉర్దూనుండి ఇంగ్లీషు, ఇంగ్లీషు నుండి తెలుగు, తెలుగు నుండి తెలుగు నిఘంటువులను చుట్టూ పెట్టుకొని, నా కనిష్ట కుమార్తె ఫాతిమా (మున్నీ)ని ప్రక్కన కూర్చుండబెట్టుకొని రోజుకు రెండు లేక మూడు పుటల చొప్పున మాత్రమే తెనిగిస్తూ, వాక్యం తరువాత వాక్యం చొప్పున ఆమె చదువుతూవుంటే నేను ఆంధ్రంలో 'ఏదో....' రాశాను. అవసరమైనప్పుడల్లా

డిక్షనరీ సహాయం అమ్మాయి ద్వారానే కోరాను. నిఘంటువులలోని అక్షరాలు మరీ సన్నవి కదా? ఎలాగోలా చిత్తుప్రతి అయింది. దానిని రోజుకు 2,3సార్లు నేను చదువుతూ మార్పులు, చేర్పులు, కూర్పులు- ఇది నా స్వంత రచనకాదు; ఇష్ట మొచ్చినట్లు మార్పులు చేయటానికి- కనుక నా పరిధిని నేనెరిగి... శుద్ధప్రతిని తయారు చేశాను. ఇక గీటురాయికి చేర్చాల్సివుంది.

పోస్టు చేయబోయి, ఠక్కున ఆగాను. మా ప్రొద్దుటూరులోని ఉలమాలను సంప్రదిస్తే బాగుంటుందనే ఆలోచన తోచింది. ఊర్లో నాకు నచ్చిన, 10,000మంది ముస్లిములు మెచ్చిన, నా దృష్టిలో నిష్టాగరిష్టుడైన ఓ మౌలానాని ఆశ్రయించాను. ఆయన 8వ తరగతివరకు తెలుగు మీడియంలో ప్రథమ శ్రేణిలో చదివారని నాకు అదివరకే తెలుసు. ఆయన వయస్సు చిన్నదేగానీ చాలాపెద్ద ఇస్లామీ జ్ఞానంగల బుర్ర ఆయన భుజాలపై ఉందని నేనెరుగుదును. పెద్దలను గౌరవించే, పెద్ద మనస్సున్నవారు. ఆయనకు నేరాసిన ఈ 'మరణం నుండి మట్టిపాలయ్యేదాకా' అన్న తర్జుమా స్క్రిప్టును, ఉర్దూ మాత్రుకను ఇచ్చి, తప్పులుంటే దిద్దమని కోరాను. ఆయన ఆసాంతం చదివి; 'మీరు తర్జుమా చేయటంలో సంపూర్ణ న్యాయం చేకూర్చారు. అనువాదం సంతృప్తికరంగా ఉంది' అంటూ రెండుచోట్ల అరబీపదాల ఉచ్ఛరణను మాత్రం (Spelling Mistakes) దిద్దారు.

ఈ పుస్తకం ముస్లిం ప్రజానీకానికి తప్పక నచ్చుతుంది అనుకుంటున్నాను. తెలుగు మాత్రం తెలిసిన ముస్లింలకు కనీసావసర జ్ఞానాన్ని తెలియజేస్తుంది అని ఆశిస్తున్నాను.

వస్సలాం

డాక్టర్ బద్దేలి (డా॥ షేక్ ఖాశిం సాహెబ్)
*B.V.Sc*
ఫోన్: 9885387440, 9397026887

అనంతకరుణామయుడు అపారకృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# మరణం నుండి మట్టిపాలయ్యేదాకా

## మరణం

మరణం తథ్యం. పుట్టిన ప్రతివాడు చావవలసిందే. ప్రతి ప్రాణికీ జీవితం అనే ఓ నిర్ణీత గడువును ఇచ్చాడు అల్లాహ్. ఈ నిర్ణీత సమయం లేక వ్యవధి పూర్తిఅయిపోగానే జీవించే అవకాశం ఎవ్వరికీ ఇవ్వబడదు. మృత్యుసమయం కూడా నిర్ణయింపబడిందే. జీవరాసులలోని ప్రతి ప్రాణి ఏదో ఒకరోజు మృత్యు వాతపడక తప్పదు. ఏ ప్రాణికీ మరణంనుండి తప్పుకునే ఏర్పాటు ఏదీలేదు. మనిషి ఎక్కడున్నాసరే తన తెలివితేటలు, బుద్ధికుశలతలతో ఎలాంటి పటిష్టమైన భవనంలో దాగినా, ఎలాంటి పకడ్బందీ గల సురక్షిత స్థావరంలో శరణుపొందినా అతను మరణం నుండి మాత్రం శరణు పొందలేడు. మొత్తానికి ప్రతివాడు ఏ పరిస్థితులలో ఉన్నా నిర్ణీత సమయానికి మరణించవలసిందే.

కాబట్టి మృత్యుభయంతో పారిపోయేందుకు ప్రయత్నించే బదులు అవివేకాన్ని వదిలి దానిని ఆహ్వానించే ఏర్పాట్లు చేసుకోవడం తెలివిగల వారు చేయవలసిన పని. పవిత్ర ఖుర్ఆన్ చూపేదారిలో, ప్రవక్తాధినేత(స) గారు ఏర్పర్చిన మార్గంలో జీవనాన్ని గడపడమే మరణాన్ని స్వీకరించడానికి చేసుకునే ఏర్పాటు.

## రోగుల పరామర్శ

హఠాన్మరణాల విషయం అలా ఉంచితే, సర్వసాధారణంగా అత్యధిక సందర్భాలలో మరణానికి ముందు ఏదో ఒక వ్యాధి మనిషికి సోకుతుంది. రోగకారణంగా చాలామందికి చాలా కష్టం కలుగుతుంది. ఐతే

నిశితంగా ఆలోచిస్తే వ్యాధి కూడా ఒక భాగ్యమే. ఆరోగ్య భాగ్యంగల కాలంలో ఎవరెవరెలాంటి వక్రమార్గాలనవలంభించినా, ఎంత ఏమరు పాటుకు లోనైనా సరే వ్యాధిగ్రస్తుడవగానే అల్లాహ్‌ను ఆయన ప్రవక్త(స) వారిని స్మరిస్తాడు. పశ్చాత్తాపపడతాడు. తౌబావైపు మరలుతాడు. అలాచేస్తే శారీరక వ్యాధికి, మానసిక రోగానికి కొంత స్వస్థత, ఊరటలు కలుగుతాయి.

దైవప్రవక్త(స)వారు ఇలా సెలవిచ్చారు. 'ముస్లిమ్‌కు కలిగే బాధ, వ్యాధిగాని లేక మరేదైనాగాని కలిగితే దానికారణంగా అల్లాహు తఅలా అతని దోషాలను చెట్లనుండి పండిన ఆకులు రాలినట్లు రాల్చుతాడు."

(బుఖారీ, ముస్లిం)

ముస్లిములందరూ ఒక శరీరంలాంటివారు కావటం వల్ల శరీరంలోని ఒక అవయవానికి బాధగలిగినా దేహంలోని అన్ని భాగాలపై కూడా దాని ప్రభావం పడుతుంది. కనుక విశ్వాసియైన ప్రతి ముస్లిమ్ ఇతర మోమిన్ సోదరుడు రోగగ్రస్తుడై ఉంటే అతనిని పరామర్శించడానికి వెళ్ళాలి. వ్యాధిగ్రస్తుని యొక్క పరామర్శ (కుశలమడుగుట) కు వెళ్ళడం మహాప్రవక్త(స)వారి సున్నత్. అందులో గొప్ప 'ఫజీలత్' (ఘనత)లు ఇమిడి ఉన్నాయి.

మరో హదీసు భావం "ఒక ముస్లిమ్, మరో ముస్లిమ్ రోగిని పరామర్శించడానికి ఉదయం వెళ్తే, సాయంకాలం వరకు, సాయంకాలం వెళ్తే ఉదయం వరకు అతని కొరకు డెబ్బదివేల దైవదూతలు తప్పిదాలను క్షమించమని అతని కొరకు అల్లాహ్‌ను వేడుకుంటారు. అట్టివానికి స్వర్గంలో ఒక ప్రత్యేక తోట లభిస్తుంది." (తిర్మిజీ షరీఫ్)

ఐతే ప్రతిరోగి ఆ వ్యాధితోటే అప్పుడు మరణించక కొన్ని సందర్భాల్లో రోగి ఆరోగ్యవంతుడైపోయినాసరే. అందువల్ల వ్యాధిగ్రస్తులను పరామర్శించటానికి వెళ్ళినప్పుడు రోగికి ఆరోగ్యం చేకూర్చుమని అల్లాహ్‌ని వేడుకోవాలి. అతనితో ఓదారుస్తూ నెమ్మదిని చేకూర్చే మాటలు చెప్పాలి.

అతనికి ధైర్యం కూడా చెప్పాలి. రోగుల మనసుకు ఉత్సాహాన్ని చేకూర్చే తీరులో మాట్లాడాలి. ఒకవేళ రోగియొక్క లక్షణాలు అవాంఛనీయంగా ఉన్నట్లు అనిపిస్తే, అతని పరిస్థితి విషమిస్తున్నట్లు అగుపిస్తే ఇక స్వస్థత అనేది చేకూరతుందన్న నమ్మకం లేనప్పుడు కూడా 'నీ పరిస్థితి బాగాలేదు' అని మాత్రం చెప్పకూడదు. పైగా 'భయపడవలసిన అవసరం ఏమీలేదు, ఇన్‌షా అల్లాహ్ ఈ వ్యాధి నీ పాపాలను కడిగేయగలదు' అని ఊరడింపు మాటలు చెప్పాలి.

ప్రతి ముస్లిమ్ తాను విశ్వాసస్థితిలో కన్నుమూయాలని ఆకాంక్షిస్తాడు. తాను ఓ ముస్లిమ్ అయినందున ఎదుటి ముస్లిమ్ కోసం మేలు కోరటం ప్రతి మోమిన్ బాధ్యత. కారణం, దేన్నయితే మనకోసం కోరుకుంటామో దానినే మన సోదరుల (ముస్లిం)కోసం కోరుకోవడం మన విధి. కాబట్టి ముస్లింలందరికోసం 'ఖాతిమా బిల్ ఖైర్' మేలైన అంతాన్నే కోరుకోవడం, ఆమేరకు దుఆలు చేయడం, ఉత్తమమైన పని.

ముఖ్యంగా వ్యాధికి గురైన ముస్లిమ్ లేక అవసానదశలో ఉన్నవారి కోసం మాత్రమే దుఆలు చేయటంకాదు, అతడు దైవాన్ని విశ్వసిస్తూ, ఇస్లామ్ ధర్మాన్ని కలిగి ఇహంనుండి పరానికి పోవునట్లుగా ప్రయత్నం చేయాలి. కనుక రోగులవద్ద మాట్లాడేటప్పుడు ఈ విషయాలందు జాగ్రత్త వహించాలి. దాంతోపాటు రోగికి ఇహలోకవాంఛలు కలిగేటట్లు మాత్రం మాట్లాడరాదు. ఇహాన్ని వదులు తున్నందుకు వాని మనసుకు బాధకలిగే ఎలాంటి మాటలు మాట్లాడరాదు. అన్నివిధాలా నెమ్మది, స్వాంతన చేకూర్చే వాక్యాలను పలికాలి.

## అవసాన దశ

గుర్తులనుబట్టి రోగికి అవసానదశ ఆసన్నమైనదని తెలియగానే, మృత్యువు అతని ముంగిట నిలిచియున్నదన్న విషయం స్ఫురించగానే-

అంటే శ్వాస ఆగిపోయే లేక త్వరత్వరగా ఉచ్వాస నిశ్వాసాలు జరుగునప్పుడు, కాళ్ళు వేలాడిపోయి స్వాధీనం తప్పి నిలబడక లేకుండినప్పుడు ముక్కుపుటాలు ఎగిరెగిరి పడునప్పుడు, ముఖకవళికలు మారిపోయినప్పుడు, కణతలు కొట్టుకోవడం ఆగిపోతున్నప్పుడు ఆ పరిస్థితులననుసరించి రోగిని కుడిపక్కగా వత్తిగిలిజేసి అతని ముఖాన్ని ఖిబ్లావైపు ఉండేలా చేయాలి. ఏ కారణం చేతనైనా అతనిని ప్రక్కవైపు పడుకోబెట్టడానికి వీలులేకపోతే, వెల్లికిలా పరుండబెట్టాలి. మరియు ఖిబ్లావైపు కాళ్ళు ఉండేలా జాగ్రత్తపడాలి. కానీ ఇలాంటి స్థితిలో తలభాగాన్ని ఎత్తుగా ఉండేలా చూడాలి లేక తలకింద తలగడపెట్టి రోగి ముఖం ఖిబ్లావైపు ఉండేలా చేయాలి.

రోగి అవసానదశకు చేరుకున్నప్పుడు అతని బంధువులు చాలా మట్టుకు ఏడ్పులు, పెడబొబ్బలు పెట్టడం మొదలెడతారు. ఇది తగనిపని. అశుభమైన చర్య. ఈ దశ అతిసున్నితమైన దశ. ప్రాణంపోయే ముందు ఆత్మ(రూహ్) గొంతు వరకు రానంతవరకు రోగికి సద్బోధ చేస్తూనే వుండాలి. అంటే అతనివద్ద కలిమయే తయ్యిబా, కల్మయే షహాదత్ పఠిస్తూ ఉండాలి. కారణం దాన్ని విని రోగి కూడా ఆ వాక్యాలు చదవాలనే తలంపు మాత్రమే. దాంతోఅతనికి ముక్తి లభించవచ్చు.

హజ్రత్ ముఆజ్ బిన్ జబల్(రజి)గారు, దైవప్రవక్త(స) ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారు. "ఏ వ్యక్తి చివరి పలుకులు 'లాయిలాహ ఇల్లల్లాహ్ ముహమ్మదుర్ రసూలుల్లాహ్' ఉంటాయో అతడు స్వర్గంలో ప్రవేశిస్తాడు' (అబూదావూద్)

కాని ఇలాంటి స్థితిలో రోగికి, కలిమా చదవమని వత్తిడి చేయడం ఉచితమైనదికాదు. ప్రాణంపోయే పరిస్థితి అతి క్లిష్టమైన స్థితి. అందువల్ల ఆ గడ్డుస్థితి సహించరానిదిగా ఉన్నందువల్ల ఆ రోగి కలిమాను చదవడానికి నిరాకరించ వచ్చు. కాబట్టి ఆ నిరాకరణ లాభానికి బదులు రోగికి నష్టాన్ని

కలిగించవచ్చు. కనుక ఆ సమయాన అక్కడున్నవారు మాత్రమే ఉచ్ఛ స్వరంతో కలిమాలు చదవాలి. దాంతో రోగికి తనంతట తానుగా కలిమాలు చదివే కోరిక కలుగు తుంది. ఒకవేళ రోగి మొదట ఒకసారి కల్మా పఠించి, ఆ తరువాత ఏదైనా మాట్లాడితే కలిమా పఠించే బోధనను కొనసాగించాలి. ఏ రకంగానైనా రోగి చివరి పలుకులు **'లా ఇలాహ ఇల్లల్లాహు ముహ మ్మదుర్ రసూలుల్లాహ్'** అయి ఉండాలనేదే ఆ ప్రయత్నం.

అలాంటి స్థితిలో రోగివద్ద ధార్మికులు, ఇస్లామ్ ధర్మాన్ని అనుసరించే వారు ఉండడం శ్రేష్టమైన పని. అక్కడున్న వారందరూ దైవధ్యానాన్ని కొనసాగిస్తూ ఉండాలి. తమకు, రోగికి శుభాలు కలుగజేయమని దుఆలు చేస్తూ ఉండాలి. ఎలాంటి చెడుమాట ఉచ్చరించకూడదు. ఎందుకంటే, ఆ సమయాన దైవదూతలు ప్రతి మాటకూ ఆమీన్ అని అంటూ ఉంటారు.

మరణవేదన సమయాన రోగికి మరణవేదన కలుగుతూ ఉందని అనిపిస్తే రోగి చెంత కొంత బిగ్గరగా సూరయె యాసీన్, సూరయె రఅద్ పఠించాలి. దీనివల్ల ప్రాణంపోయేటప్పుడు కలిగే బాధ తగ్గుతుంది.

## మృతుని తలుచుకొని ఏడ్వడం

ఆత్మ (రూహ్) శరీరాన్ని వదిలిపోయాక కూడా అక్కడున్నవారు మరణించినవారి గుణగణాలను పొగుడుతూ ఏడ్వడం నిషిద్ధం' మరణిం చిన తర్వాత **"ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్"** అనాలి. ఓర్పు వహించాలి. ఏడ్పులూ, పెడబొబ్బలు పెట్టడం, హృదయ విదార కంగా రోధించడం మంచిది కాదు. రోగి ఆత్మను అల్లాహ్ ఆజ్ఞమేరకు దైవ దూతలు తీసికెళ్ళారు' అనే విషయం గుర్తంచుకోవాలి.

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నె మస్ఊద్(రజి)గారు రసూలుల్లాహ్(స) వారి మాటలను ఇలా ఉల్లేఖించారు: "మృతున్ని తలుచుకుని చెంపలపై

కొట్టుకొనేవారు, బట్టలను చించుకునేవారు అజ్ఞాన కాలంలోవలె పెడ బొబ్బలు పెట్టి ఏడ్చేవారు మాలోనివారు కారు."

చనిపోయినవారి దగ్గరి బంధువులకుగాని, స్నేహితులకుగాని, ఇరుగు పొరుగువారికిగాని, తనవారికిగాని, పరాయివారికి గాని రోగి మరణించినందుకు మనస్తాపం, దుఃఖం తప్పక కలుగుతుంది. మృతుని హఠాన్మరణం కారణంగా దుఃఖం కలగడం సహజం. ఏడ్వడం అన్నది నిషిద్ధమైన అంశమూ కాదు. అయితే ఓర్పు, సహనం వహించాలి. సరిబెట్టు కొని నోటినుండి వెడలేమాట శబ్దంలేకుండా వచ్చే కన్నీటికి మించకుండా చూసుకోవాలి.

హ(జత్ అనస్(రజి)గారి ఉల్లేఖనాన్ని అనుసరించి, వేము రసూలుల్లాహ్ (స)గారి వెంట ఒకసారి అబూసైఫ్‌గారి ఇంటికి వెళ్ళడం జరిగింది. ఆయన(స) జనాబ్ ఇబ్రాహీం(రజి) రసూలుల్లా(స)గారి కుమా రుడుగారికి పాలిచ్చి పెంచుతున్నదాయీ గారి భర్త. జనాబ్ ప్రవక్త(స)వారు హ(జత్ ఇబ్రాహీమ్ (రజి)గారిని వడిలోకి తీసుకొని ఆయన్ను ముద్దుపెట్టు కున్నారు. తమ పవిత్ర ముఖాన్ని ఆయన(రజి) ముఖంతో రాపడించారు.

కొన్ని రోజుల తరువాత మేము మళ్ళీ అక్కడికి వెళ్ళాము. అప్పుడు ఇబ్రాహీం గారు (రజి) ఇహలోకాన్ని వదిలి వెళ్తున్నారు. రసూలుల్లాహ్(స) గారి కనులనుండి కన్నీరు కారనారంభించాయి.

మహాప్రవక్త(స)వారిని, హ(జత్ అబ్దుర్‌రహ్మాన్ బిన్ ఔఫ్(రజి)గారు ఇలా అడిగారు. దైవప్రవక్తా(స)! తమరు కూడా ఏడుస్తున్నారా?'అని,

ఓ ఇబ్నె ఔఫ్(రజి)! ఈ కన్నీరు కారుణ్యానికి గుర్తు' అని ఆయన(స) మరింతగా కన్నీరు కార్చారు. ఆ తరువాత ఇలా అన్నారు. కన్నీళ్ళు కారుతూ ఉన్నాయి. మనసు పరితపిస్తూ వుంది. అయితే నేను ఆ నిజాన్నే సత్యమైన ఆ మాటే పలుకుతున్నాను. దేనితోనైతే మన దైవం రాజీపడతాడో ఆ మాటే

అంటాను ఓ ఇబ్రాహీం(రజి)! నీ ఎడబాటువల్ల మేము దుఃఖంలో మునిగి వున్నాము. (బుఖారి, ముస్లిం)

ప్రేమ వల్ల శవాన్ని ముద్దాడడానికి అనుమతి ఉంది. కనుక ముస్లిముల మాతృమూర్తి అయిన హజ్రత్ ఆయిషా సిద్దీఖా(రజి)గారు ఇలా సెలవిస్తున్నారు- 'రసూలుల్లాహ్(స)వారు, హజ్రత్ ఉస్మాన్ బిన్ మజ్ఊన్ (రజి) గారి మృత కళేబరాన్ని ముద్దుపెట్టుకొన్నారు. ఆయన(స) ఏడ్చారు కూడా. ఎంతగా ఏడ్చారంటే ఉస్మాన్(రజి)గారి ముఖంపై ఆయన(స)వారి కన్నీరు పడి ప్రవహింపసాగాయి. (తిర్మిజి)

## వెంటనే చేయవలసిన పనులు

ప్రాణం పోయిన వెంటనే సాధారణంగా శవం నోరు, కళ్ళు తెరుచుకుని ఉంటాయి. కళ్ళు తెరుచుకుని వుంటే కనురెప్పల్ని నెమ్మదినెమ్మదిగా మూసివేయాలి. మృతుని నోరు తెరుచుకొని ఉంటే దాన్ని ఏదైనా పరిశుభ్రమైన గుడ్డపేలికను గడ్డం కిందినుండి తలపైకి తీసి కట్టివేయాలి. దానివల్ల నోరు మూసుకొని ఉంటుంది. కాళ్ళు ముడుచుకుని ఉంటే, వాటిని కూడా సరిచేసి చాచి రెండు కాళ్ళ బొటనవేళ్ళను కలిపి కట్టివేయాలి. కానీ ఇదంతా జాగ్రత్తగా నెమ్మదిగా చేయవలసిన పని. ఈ పని మృతుని దగ్గరి బంధువులు చేయడం ఉత్తమం. అలాంటి వారెవరూ సమయానికి లేకుంటే అక్కడున్నవారిలోని ఓ మృదు స్వభావుడైనవారు ఈ పనిచేయాలి. ప్రాణం పోయిన కొద్దిసేపటివరకు శరీరావయవాలు మెత్తగా ఉంటాయి. కనుక ఈ పనులు చేయడానికి వెంటనే పూనుకోవాలి. లేకపోతే శరీరం బిగుసుకొని పోయాక ఈ పనిచేయడం కుదరదు. పై పనులన్నీ పూర్తిచేసిన తర్వాత శవంపై దుప్పటిని కప్పేయాలి. సుగంధ ద్రవ్యాలను ఉంచడం లేదా కాల్చడం చేయాలి.

## శవస్నానం (గుస్ల్)

శవానికి స్నానం చేయించడం 'ఫర్జె కిఫాయా'. అంటే ఆ పనిని కొందరు చేయిస్తే తక్కినవారందరిపై నుండి ఈ బాధ్యత (ఫర్జ్) తొలగి

పోతుందన్నమాట. శవస్నానం కోసం వాడే నీటిలో రేగు ఆకులువేసి దానిని మరగబెట్టాలి. తరువాత ఆ నీటిని గోరువెచ్చ అయ్యేలా చల్లార్చాలి.

హజ్రత్ ఉమ్మె అతియా అన్సారియా (రజి)గారి ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త(స)వారి కుమార్తెగారు (రజి) మరణించినప్పుడు, ఆయన(స)వారు మావద్దకొచ్చి ఇలా ఆదేశించారు: 'ఆమెను మూడుసార్లు రేగు ఆకులతో మరిగించిన గోరువెచ్చని నీటితో స్నానం చేయించండి, చివరిసారి కర్పూరం వేసిన నీరు ఆమె శరీరంపై పోయండి.' (బుఖారి)

శవస్నానం చేయించాల్సిన చెక్కబల్ల లేక పీటను మొదట బాగుగా కడిగి తుడిచి ఉంచుకోవాలి. ఆ తరువాత దానికి మూడు లేక ఐదు పర్యాయాలు సాంబ్రాణి ధూపం పట్టాలి. లేదా అగరువత్తుల ధూపమైనా పట్టచ్చు. తరువాత ఆ బల్ల లేక పీట యొక్క పొడవును ఉత్తర దక్షిణాలుగా ఉండేలా వాల్చాలి. పిమ్మట శవాన్ని అలాగే సమాధిలో ఉంచేటప్పుడు కూడా తల ఉత్తరం వైపు కాళ్ళు దక్షిణం వైపు ఉండేలా పడుకోబెట్టాలి. స్నానం చేయించేటప్పుడు ముఖం ఖిబ్లావైపున ఉండేలా జాగ్రత్త పడాలి. అలా ఏర్పాటు చేయవీలు లేకపోతే శవాన్ని తూర్పు పడమరలుగా పడుకోబెట్టవచ్చు. తల తూర్పు వైపు పాదాలు పడమటి వైపున ఉండేలా అన్న మాట. అయితే తలకాస్త ఎత్తుగా ఉండేటట్లు మంచం లేక బల్లను తూర్పు వైపున కొంత ఎత్తుగా ఉంచాలి. అంటే ముఖం ఖిబ్లా వైపున ఉండేలా అన్నమాట. అది కూడా సాధ్యపడకపోతే ఎలా వీలైతే అలా గుస్ల్ కోసం పడుకోబెట్టవచ్చు. అంటే దిశ విషయంలో ఫలానా వైపు పడుకోబెట్టాలనే ఖచ్చితమైన నియమం ఏదీ లేదు. (ఫతావా ఆలంగీరీ)

శవస్నానం చేయించేవాడు మృతునికి శ్రేష్టతరమైన వ్యక్తి అత్యంత సన్నిహిత బంధువు, ధార్మికుడైనవాడు.అయితే భార్య శవానికి భర్త, భర్త శవానికి భార్య శవస్నానం చేయించడం విషయంలో పండితుల్లో భేదాభిప్రాయాలున్నాయి. కొందరి దృష్టిలో ఎవరి ప్రోద్బలమూ లేక స్నానం

చేయించటంలో తప్పుగాదు. అయితే మరికొందరు- విధిలేని పరిస్థితిలో భార్య భర్త శవానికి స్నానం చేయించి శవానికి 'కఫన్' శవవస్త్రాలు తొడగ వచ్చు అని అంటారు. ఐతే భర్త భార్య శవానికి స్నానం చేయించే అనుమతి మాత్రంలేదు.

శవాన్ని బల్లపై పడుకోబెట్టి దానిపై ఒక బట్టకప్పాలి. ఆ తరువాత అంతక్రితం వంటిపై ఉన్న బట్టలను జాగ్రత్తగా తీసేయాలి.

గుస్ల్ వ్యవహారంలో మొదట మలమూత్రాల స్థానాలను శుభ్రం చేయాలి. దీనికొరకు మొదట్లోనే చేతికి మేజోడు లేక చేతి తొడుగులాంటివి బట్టతో చేసిన సంచులను ఉపయోగించాలి. ఆ తరువాత శవంపైన కప్పబడిన వస్త్రం కిందుగా చేతినిపోనిచ్చి గ్లౌజ్ తొడుక్కున్న చేతిని పోనిచ్చి శవం మలమూత్ర ద్వారాలను శుభ్రపరచాలి. శుభ్రపరిచే నిమిత్తం మొదట మట్టిపెడ్డలను, ఆ తరువాత నీటిని వాడాలి. ఆ తరువాత తొడిగి వున్న చేతితొడుగు(గ్లౌజు)ను తీసి, చేతిని కడుక్కోవాలి.

మలమూత్ర పారిశుధ్యం తరువాత వుజూ చేయించాలి. ఈ వుజూ కూడా నమాజు కోసం చేసే వుజూలాగే వుంటుంది. ఐతే నమాజు కోసం వుజూలోలా మణికట్టువరకు చేతులు కడగటం, పుక్కిలింత కోసం, ముక్కులోని నీరెక్కించే అవసరం లేదు. అయితే దూది లేదా గుడ్డపేలిక లతో చుట్టిన ఉండల్ని తడిపి శుభ్రపరచాలి. అలాగే వ్రేలికి గుడ్డను చుట్టు కొని పండ్లపై రుద్దాలి. అలాగే మరో వత్తి ఉండతో ముక్కు రంధ్రాలలోనికి, చెవుల్లోనూ దూదిపెట్టాలి. ఎందుకంటే గుస్ల్ చేయించేటప్పుడు నీరు లోపలికి వెళ్ళే అవకాశం ఉండదు. అలాంటి అనుమానం కూడా ఉండదు కాబట్టి.

ఆ తరువాత ముఖం కడగాలి. ఆ తరువాత మోచేతుల వరకు రెండు చేతులు తడిసేటట్లు కడగాలి. ఆ పిమ్మట తల మసాచేయాలి. ఆ తరువాత రెండు పాదాలు కడగాలి.

వుజూ అయిపోయాక శవం యొక్క తలను, ముఖాన్ని పూర్తి దేహాన్ని, శవపు గడ్డాన్ని పరిశుభ్రమైన మట్టితో లేక శనగపిండి లేక పరిశుభ్రమైన సబ్బుతో అది లేకపోతే కేవలం పరిశుభ్రమైన నీళ్ళతో నెమ్మదిగా నెమ్మదిగా బాగా కడగాలి. మనం మన శరీరాన్ని ఎలా శుభ్రపర్చుకుంటామో అదే విధంగా శవపు శరీరాన్ని నెమ్మదిగా మృదువుగా రుద్ది కడగాలి.

శవం వంటిని శుభ్రపరిచాక శవాన్ని ఎడమపక్క ఆధారంగా పరుండబెట్టి తలనుండి పాదాల వరకు మూడుసార్లు రేగు ఆకులతో కాచిన నీటిని ప్రవహింప జేయాలి. ఆ తరువాత కుడివైపు పరుండజేసి అలాగే తలమొదలు పాదాల వరకు మూడుసార్లు నీటిని పోయాలి. రెండువైపుల నీరు పోశాక శవాన్ని వెల్లకిలా పరుండబెట్టి వెనుకవైపు చెయ్యిపోనిచ్చి, తలను కొంత పైకెత్తి పొట్టను మృదువుగా నొక్కాలి. ఇలా చేయడం వలన ఏదైనా మలపదార్థం లోన ఉండిఉంటే అది బయటికి వచ్చేస్తుంది. తిరిగి ఇదివరకు ఏవిధంగా మల మూత్ర స్థానాలను ఎలా శుభ్రపరిచామో అలా మళ్ళీ కడిగి తుడిచేయాలి. ఆ తరువాత తల మొదలు పాదాలవరకు మూడుసార్లు కర్పూరం కలిసిన నీరు శవం యొక్క శరీరంపై ప్రవహించేలా పోయాలి. దాంతో గుస్ల్ సంపూర్ణమవుతుంది.

శవస్నానం చేయించే నిమిత్తం వాడబడని కొంగొత్త మట్టికుండ, కొత్త మట్టి చెంబు కావాలని, అదే నియమమని అనుకుంటారు కొందరు. మరికొందరైతే శవస్నానానికి వాడిన కుండలు ముంతల పగులగొట్టే మూఢాచారాన్ని అవలంభించడం కద్దు. కాబట్టి అదివరకే ఇంటివారు వాడుతున్న పాత్రలనే శవస్నానానికి ఉపయోగించడం లేక కొత్త పాత్రలను ఉపయోగించడం కూడా ఉచితమైన విధానం. శవస్నానం చేయించిన తరువాత వాటిని ఇంటివాడకంలో ఉపయోగించుకోవచ్చు. అందులో తప్పు లేదు.

శవస్నానం అయ్యాక శవానికి ఎదనుండి మోకాళ్ళ కిందివరకు మరో శుభ్రమైన బట్టతో కప్పి స్నానార్థం ఉపయోగించిన బట్టలను నెమ్మదిగా తొలగించాలి. తడిని పోగొట్టే నిమిత్తం పరిశుభ్రమైన వస్త్రంతో శవాన్ని తుడవాలి.

శవస్నానం చేయించే వ్యక్తి శవస్నానం పూర్తిచేశాక తాను కూడా స్నానం చేయవలసి ఉంటుంది. ప్రవక్త మహనీయులు(స) వారు ఇలా సెలవిచ్చారు;

"శవానికి స్నానం చేయించిన వ్యక్తి ఆ తరువాత తానుకూడా స్నానం చేయాలి. అలాగే శవాన్ని మృత్యుస్థానం నుండి శవస్నానపు పీటవరకు ఎత్తుకొని రావటంలో సహకరించినవారంతా తప్పనిసరిగా వుజూ చేయాలి.' (తిర్మిజీ)

## శవానికి బట్టలు తొడగడం (తక్ఫీన్)

గుస్ల్ ముగిశాక శవానికి శవ వస్త్రధారణ (కఫనానా) మొదలు పెట్టాలి. శవం స్త్రీదైనా, పురుషుడిదైనా కఫన్‌లో తెల్లబట్టలనే ఉపయోగించాలి. మన ప్రవక్త(స)వారు ప్రవచనం ఇలా ఉంది.

"తెల్లబట్టలనే ధరిస్తూ ఉండండి. అవి మీకోసం మంచి దుస్తులు. మీ శవాలకు కూడా తెల్లని బట్టలే తొడగండి.' (తిర్మిజీ)

పరిశుభ్రమైన పాత వస్త్రాలను మయ్యత్ కఫన్ కోసం వాడడం కూడా ధర్మసమ్మతం (జాయెజ్) అని చాలామంది ధార్మిక పండితుల అభిప్రాయం. దానికి వారు చూపే రుజువు ఏమిటంటే, హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్(రజి)గారు తమ కుమార్తె, ముస్లింల మాతృమూర్తి అయిన హజ్రత్ ఆయెషా(ర)కు చేసిన మరణ శాసనంలో తాము (అబూబక్ర్(ర)) చనిపోయిన తరువాత తమ శవానికి పాతబట్టలనే కఫన్‌గా తొడిగించమని కోరి ఉండడం. ఆమేరకే ఆయన కోరిక నెరవేర్చబడింది. కారుణ్యమూర్తి హజ్రత్ ముహమ్మద్(స)వారి ఓ ఆదేశం ఇలా కూడా ఉంది.

"మీ సోదర మృతులకు కఫన్ తొడిగితే మేలైన కఫన్‌నే తొడగండి."

కాబట్టి శవ వస్త్రధారణ విషయంలో ఆ మృతునికి సంబంధించిన వారు తమ శక్తిస్థోమతలను బట్టే కఫన్ బట్టలు కొనాలి. అంటే దుబారా ఖర్చుజరుపకుండా అలాగే మరీ పిసినారితనం పాటించకుండా ఉండే కఫన్‌ను తొడగాలి.

ఓ ముస్లిమ్‌కు తాను జీవించి ఉన్నప్పుడు ఎలాంటి వస్త్రధారణ చేసే అనుమతి ఉందో అలాంటి బట్టలే మృతుని శవానికి కూడా వాడే అనుమతి ఇవ్వడం జరిగింది. అంటే పసుపురంగు గాని, కేసరి వర్ణం బట్టలుగాని, పట్టు వస్త్రాలు గాని పురుషులకు, పురుష శవాలకు నిషిద్ధం. అయితే పై రంగుల వస్త్రాలు, పట్టుబట్టలు స్త్రీలకు, స్త్రీల శవాలకు ధర్మసమ్మతమైనవే.

శవం పురుషులదైతే దానికి మూడు వస్త్రాలతో కఫన్ తొడగాలి. మహిళల కఫన్‌లో అయిదు బట్టలు వాడాలి. కఫన్ యొక్క పొడవు వెడెల్పులు ఆయా శవాల వడ్డుపొడువులపై ఆధారపడి ఉంటాయి. సగటు శవవస్త్రాల పొడవు వెడెల్పులు ఈ క్రింది విధంగా ఉండాలి.

| వస్త్రం పేరు | పొడవు | వెడల్పు |
|---|---|---|
| 1.'కఫనీ' లేక 'కమీజు' | వస్త్రాన్ని మడత వేస్తే భుజాలనుండి కాలిపిక్కల వరకు వచ్చేవరకు | 92 సెం.మీ లేక ఒక గజం |
| 2.ఇజార్ లేక తహ్‌బంద్ | శవపు తలనుండి పాదాలవరకు | 1 మీ. 15 సెం.మీ లేక 1 1/4 గజం |
| 3. లిఫాఫా లేక ఛాదర్ | ఇజారు కన్నా కొంచెం పొడవు కొంచెం పొడవు తలపైన, పాదాల కిందికి బట్టను ఒకచోట చేర్చి కట్టివేయగలిగినంత | ఇజారులాగా 1 మీ. 15 సెం.మీ లేక 1 1/4 గజం |
| స్త్రీ శవానికి దిగువ పేర్కొన్న వస్త్రాలకంటే మరి రెండు అదనపు వస్త్రాలను తొడగాల్సి ఉంటుంది. | | |
| 4. సీనాబంద్ | శవపు చంకలనుండి కాలిపిక్కల వరకు | ఇజారు లాగే 1 మీ. 15 సెం.మీ లేక 1 1/4 గజం |
| 5. సర్‌బంద్ | 1 మీ. 40 సెం.మీ లేక 1 1/2 గజం | 70 సెం.మీ లేక 3/4 గజం |

కఫ్నీ లేక కమీజ్ని రెండు సమ భాగాలుగా మడచి మధ్యలో కోత పెట్టాలి. ఆ రంధ్రం గుండా సునాయాసంగా శవం తలను దూర్చడానికి వీలు కలుగుతుంది. ఆ కోత లేక చీలిక పురుషులకైతే భుజాలపై స్త్రీలకైతే వక్షస్థలంవైపు వస్త్రంపై కత్తిరించాలి (కోతపెట్టాలి).

## కఫన్ తొడిగే విధానం

మొదట లిఫాఫా లేక చాదర్ని(3) పరచాలి. దానిపై ఇజార్(2) దానిపై కఫనీ లేక కమీజు(1) పరచాలి. కఫనీ సగభాగం కోతబెట్టిన చోట తలవైపు మడిచిపెట్టుకొని రెండవ పొర పరచాలి. శవానికి స్నానం చేయించే ముందే ఈ ఏర్పాట్లు చేసుకోవాలి. గుస్ల్ చేయించిన వెంటనే పరువబద్ధ ఈ బట్టలపై తెచ్చి దాన్ని పడుకోబెట్టాలి. అన్నింటికన్నా ముందు కఫనీ(1) తొడగాలి. తలపైనా, గడ్డానికి అత్తరు పూయాలి. కర్పూరాన్ని నొసలు, ముక్కు, అరచేతులు, మోకాళ్ళు మరియు పాదాలపై రుద్దాలి. ఆ తరువాత ఇజారు(2)ను మొదట శవపు ఎడమవైపు బట్టను శవంపై కప్పాలి. ఆ తరువాత కుడివైపు ఉన్న బట్టను కప్పాలి. ఆ తరువాత లిఫాఫా(3)ను కూడా అదే విధంగా మొదట ఎడమ తరువాత కుడివైపుల నుండి చుట్టాలి (కప్పాలి) చుట్టగా తలవైపు మరియు కాళ్ళవైపు మిగిలి లిఫాఫా కాళ్ళవైపు ఉన్న బట్టలను వేర్వేరుగా దగ్గరికి చేర్చి ఒక్కో గుడ్డపేలికలో రెండు వైపుల (తలపైన, పాదాల క్రింద) కట్టాలి. మరో 3వ గుడ్డపేలికతో నడుమును కూడా కట్టాలి. కారణం బట్టలు విడిపోకుండా లేక జారిపోయే అనుమానం రాకుండా ఉంటుందనే.

స్త్రీ శవానికి కఫనీ (1) తొడిగాక తలవెంట్రుకలను రెండు భాగాలుగా జేసి ఒకభాగం ఎదకు కుడివైపు, రెండవ భాగం ఎదకు రెండవవైపు పడ వేయాలి. తరువాత సర్బంద్ లేక ఓణీ(5)బట్టను రెండు భాగాలుగా చేసి మధ్యభాగాన్ని తలపై కప్పుతూ దాన్ని కూడా ఎదపై పడివున్న ఒక భాగపు వెంట్రుకలపై, రెండవభాగం రెండవవైపు ఉన్న వెంట్రుకలపై పరవాలి. ఆ తరువాత సీనాబంద్ చుట్టాలి.(4). ఆ పిమ్మట ఈజార్(2) ఆ వెనుక

లిఫాఫా(1)లు చుట్టాలి. ఆ తరువాత ముందు చెప్పినట్లుగా గుడ్డపేలికలతో పైన కింద మధ్యలో కట్టాలి.

అనివార్య పరిస్థితులలో మహిళల శవానికి మూడుబట్టలలో పురుష శవానికి కేవలం ఒకే బట్టతో కఫన్ చేయటం కూడా సరియైనదే. స్త్రీల మూడు బట్టలు లిఫాఫా(3) ఇజారు(2) మరియు సర్‌బంద్(5) పురుష శవానికి కేవలం లిఫాఫా(3) ఒక్కటి సరిపోతుంది.

పిల్లలకు కేవలం ఒక బట్టతో కూడా కఫన్ తొడగవచ్చు. కాని యుక్త వయస్సుకు చేరిన పిల్లలకైతే మాత్రం పూర్తి కఫన్‌నే తొడగాల్సి ఉంటుంది.

అప్పుడే పుట్టిన బిడ్డ జీవించియున్న జాడలు కనబడి ఆ తరువాత చనిపోయినప్పటికీ ఆ శవానికి కూడా సంప్రదాయానుసారం శవస్నానం, మిగతా శవసంస్కారాలు ఆచరించవలసిందే. నమాజె జనాజా కూడా చేయవలసిందే.

ఒకవేళ కడుపులోనే మృతిచెంది పుట్టిన బిడ్డకు స్నానం చేయించి ఏదో బట్టలో చుట్టి భూస్థాపితం చేయవచ్చు. జనాబా నమాజు చదవవలసిన అవసరం లేదు.

శవానికి కఫన్ చుట్టటం కూడా ఫర్జెకిఫాయా అని గుర్తించవలసి ఉంది.

కఫన్ తొడిగాక వీలైనంత త్వరగా శవాన్ని ఖబరస్తాన్ (ఖనన వాటిక)కు తీసికెళ్ళాలి. శవాన్ని మంచంపైకాని, డోలాలో (శవాన్ని మోసుకెళ్ళే నిమిత్తం తయారుచేసిన శవపేటికలాంటిది) పడుకోబెట్టి నలుగురూ కలిసి నాలుగువైపుల పట్టి తమ భుజాలపైకి ఎత్తుకోవాలి. జనాజాను త్వరత్వరగా ఖబరస్తాన్‌వైపు మోసుకెళ్ళాలి. త్వరత్వరగా అంటే చూసేవారికి, పరిగెత్తు కుంటూ వెడుతున్నారు అనే భావన కలగకూడదు. అంటే మధ్యరకంగా కాస్త త్వరగా నడవాలి.

హజ్రత్ అబూహురైరా(రజి)గారు ప్రవక్తాధినేత(స) ప్రవచించిన ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారు:

"జనాజాను త్వరగా తీసుకెళ్ళండి. ఎందుకంటే ఒకవేళ అతను పవిత్రుడు, నీతిపరుడు అయితే అతనిని శ్రేయంవైపుకు తీసుకెళ్ళడంలోనే మేలుంది. ఒకవేళ అతడు పాపాత్ముడైతే అదో దోషం. కనుక వీలైనంత త్వరగా అతని శవభారాన్ని దింపేయాలి." (బుఖారి)

## శవపేటికకు భుజాన్ని ఆనించడం- శవయాత్రలో పాల్గొనడం

జనాజా యాత్రలో తప్పక పాల్గొనాలి. కొంత దూరమైనాసరే ఆ శవపేటికను భుజంపై పెట్టుకొని మోయాలి. ఇందుకు ప్రవక్త(స)వారి సంప్రదాయ విధానం లేక సున్నత్ ఏంటంటే, మన శరీరం శవపేటిక లేక జనాజాకు వెలుపలి వైపున ఉండునట్లుగా మొదట శవపేటిక తలవైపున మన కుడి భుజాన్నానించాలి. తరువాత వెనుకవైపు (శవం కాళ్ళవైపు) మన కుడి భుజాన్ని ఆ పిమ్మట ముందుకెళ్ళి శవానికి తలవైపు ఎడమవైపున మన ఎడమ భుజాన్ని, ఆ పిమ్మట కాళ్ళ కట్టవైపు ఎడమ భుజంతో శవపేటికను మోయాలి. ప్రతి పార్శ్వంలోనూ కనీసం పదేసి అడుగుల చొప్పున నలభై అడుగులు నడవాలి.

దైవప్రవక్త(స)వారు ఇలా సెలవిస్తున్నారు 'ఎవరైతే జనాజా వెంట వెళ్తూ మూడు పర్యాయాలు భుజాన్నానించి శవాన్ని మోస్తారో వారు జనాజా విషయంలో తన విధిని నెరవేర్చారన్నట్లే. (తిర్మిజీ)

జనాజాను తీసుకు వెళ్ళేటప్పుడు శవానికి ముందు నడవకూడదు. అలాగే శవయాత్ర సాగుతూ వుండగా ఆ దారిలో కూర్చున్నా, పడుకున్నా ముస్లిమ్ తప్పకుండా లేచి ఆ జనాజా వెంట నడవాలి. అదే ఓ ముస్లిమేతరుని శవం కనిపిస్తే లేచి నిల్చోవలసిన అవసరం లేదు.

## జనాజా నమాజు

జనాజా నమాజు ఫర్జెకిఫాయా. అంటే; కొందరు ఈ నమాజు చేస్తే తక్కినవారిపై నుండి ఆ బాధ్యత తీరిపోతుందని అర్థం. ఏ ఒక్కరూ ఈ నమాజు చేయకపోతే అందరూ పాపాత్ములైపోతారు.

నమాజె జనాజాలో రెండు ఫర్జ్‌లు (విధులు)ఉన్నాయి. 1. నాలుగు సార్లు తక్‌బీర్ 'అల్లాహు అక్బర్' పలకడం. ఆ పలికే ప్రతి తక్బీర్ ఒక్కో రకాతు నమాజుకు సమానం అన్నమాట.

2. ఖియాం, అంటే నిలుచొని జనాజా నమాజు చేయడం. ఎలాగైతే ఫర్జ్ లేక వాజిబ్ నమాజులలో నిలుచోవటం (ఖియాం) విధో మరియు అకారణంగా దానిని నిర్లక్ష్యం చేయటం (నమాజు కోసం నిర్లక్ష్యం చేయటం) ఎలా తప్పో; అలాగే ఈ నమాజు కోసం నిలుచోకపోవటం కూడా తప్పే.

## జనాజా నమాజులో మూడు అంశాలు సున్నత్‌లు

1. అల్లాహ్‌ను కీర్తించటం.
2. రసూలుల్లాహ్ (సఅసం)పై దరూద్‌ను పఠించడం.
3. మయ్యత్ (మృతుని) కోసం దుఆలు చేయటం.

ఈ నమాజులో తప్పకుండా ఎక్కువమంది హాజరు కావాలనేది (అంటే జమాఅత్) షరతుకాదు. దాన్ని ఒకేఒక పురుషుడుగాని, ఒక్క మహిళగాని చేసినా సరిపోతుంది. అయితే నమాజె జనాజా తప్పనిసరిగా ప్రతి ముస్లిమ్ మృతునికి చేయవలసిందే.

అయితే ఈ క్రిందివారు మాత్రం దానికి అర్హులు కారు.

1. పక్షపాత వైఖరితో అనవసరంగా జగడాలాడి ఆ జగడంలో మరణించినవాడు.
2. తల్లినిగానీ, తండ్రినిగానీ చంపినవాడు
3. బందిపోటుగా ఉండి, బందిపోటుతనం చేస్తూ అందులో చనిపోయినవాడు.

(ఈ మూడు రకాల శవాల నమాజు ఫర్జె ఖతయీ అలల్ కిఫాయా) ఒకవేళ పీనుగ, పై మూడు రకాలలో ఒకడని తెలిసి యుండి కూడా పాల్గొంటే అట్టివారందరూ నేరస్థులే.

ఇటీవలి కాలంలో కొందరు ఆరుబయట (Open area)లో జరుగు జనాజా నమాజులో పాల్గొనేవారు కాళ్ళకు చెప్పులు వేసుకునే జనాజా నమాజులో పాల్గొంటుంటారు. అట్టివారు ఈ విషయం గుర్తుంచుకోవలసి ఉంటుంది. వారు తొడిగియున్న పాదరక్షలు, వారు నిలిచియున్న స్థలం రెండూ పరిశుభ్రమైనవై ఉండాలి. కొందరు జోళ్ళను వదిలి వాటిపైన నిలుచుంటారు. అట్టివారి పాదరక్షలు పరిశుద్ధమైనవయి ఉండాలి.

జనాజా వెంట కేవలం పురుషులు మాత్రమే వెళ్ళాలి. స్త్రీలు జనాజా వెంట వెళ్ళకూడదు.

జనాజా నమాజులో పాల్గొనేవారికి గొప్ప పుణ్యఫలాలు లభిస్తాయి. కనుక ప్రతివారు అందు పాల్గొనవలసి వుంది. జనాజా నమాజులో పాల్గొనే వారికి ఓ వైపు గొప్ప పుణ్యఫలాలు లభించడమేగాక మరోవైపు ఎంత మంది నమాజే జనాజాలో పాల్గొంటారో అంతగా శవపు ఆత్మకు క్షమాపణ, మన్నింపు లభిస్తాయి.

ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా(రజి)గారు తమ భర్త రసూలుల్లాహ్ (స) వారినుండి విన్న ఈ హదీసును ఇలా ఉటంకిస్తున్నారు.

ఏ నమాజె జనాజాలో పాల్గొన్నవారి సంఖ్య వందకు చేరుకుం టుందో, నమాజు చేశాక- ఈ నమాజీలందరూ అతని ఆత్మశాంతి కోసం దుఆలు (షిఫాఅత్) చేయాలి. అలా చేస్తే అందరి సిఫారసు అంగీకరింప బడుతుంది.” (ముస్లిం)

హజ్రత్ అబూహురైరా(రజి)గారు ప్రవక్తాధినేత(స). వారి దిగువ ఆదేశాన్ని ఇలా తెలియజేస్తున్నారు.

“ఏ ముసల్మానైతే జనాజావెంట పుణ్యఫలాపేక్షతో వెళతాడో, అతడు జనాజా నమాజులో పాల్గొన్నాక జనాజా మగ్ఫిరత్ కోసం దుఆ అయ్యే వరకు..... సమాధి గావించటంలో పాల్గొనేవరకు... అక్కడే ఆగిపోయి వుంటాడో అతడు రెండు భాగాలు పుణ్యం తీసికొని వెళుతున్నాడు. ఆ

ఒక్కొక్క పుణ్యఫలపు పరిమాణం ఉహుదు కొండంత ఉంటుంది. అలాగే ఎవరైతే నమాజులో పాల్గొని ఇంకా సమాధి కాకముందే వచ్చేస్తాడో అట్టి వాడు ఒక ఖీరాత్ పుణ్యస్థలాన్ని తీసుకొని వెడతాడు.' (బుఖారి)

నమాజె జనాజా స్త్రీలైనా నిర్వహించవచ్చు. అయితే పైన రాసివున్నట్లుగా జనాజా వెంట వెళ్ళడం, జనాజాను మోయటం, జనాజాను సమాధిగా వించటంలో వారు పాల్గొనరాదు.

జనాజా నమాజు యొక్క 'ఇమామత్'శవపు సంరక్షకుడే (వలీ) నిర్వహింప వలసివుంది. లేక అతని అనుమతితో ఇతరులు కూడా ఇమామత్ చేయవచ్చు.

ఇమామతు చేయువారు జనాజాను పడమటిదిశలో ఉత్తర దక్షిణాలుగాబెట్టి (జనాజా డోలాతోసహా) శవానికి తూర్పువైపు ఎదకు ఎదురుగా నిలుచోవాలి. తక్కిన నమాజీలందరూ ఇమామ్ వెనుక బారులు తీరి నిలుచోవాలి. బారులు తిన్నగా లెక్కకు బేసి సంఖ్యలో వుండాలి. అంటే 3లేక 5 లేక 7వగైరా. అయితే నమాజీలు ఎంతతక్కువమంది ఉన్నాసరే కనీసం మూడు వరుసలలో నిలుచోవాలి.

జనాజా నమాజు సంకల్పంలో ఇలా అనుకోవాలి: నేను ఈ జనాజా నమాజును అల్లాహ్ కోసం ఆచరిస్తున్నాను, ఈ మయ్యత్ మగ్‌ఫిరత్ (మన్నింపుల) కోసం దుఆలు చేస్తాను.'

నియ్యత్ తరువాత ఇమాము మొదటి తక్బీరు 'అల్లాహు అక్బర్' అంటూ రెండుచేతులు చెవులవరకు ఎత్తి చేతులు కట్టుకుంటాడు. ఆ తరువాత ముఖ్తదీలు అందరూనెమ్మదిగా తగ్బీరు పలికి చేతులు కట్టుకుంటారు. ఆ తరువాత ఇమాం, ముఖ్తదీలు నెమ్మదిగా (శబ్దం వినబడకుండా) సనా పఠిస్తారు.

సనా: సుబ్‌హానకల్లాహుమ్మ వ బిహందిక వతబారకస్ముక వత ఆల జద్దుక, వజల్ల సనావుక వలాఇలాహ గైరుక్'

సనా పఠించాక ఇమాం బిగ్గరగా రెండవ తక్బీర్ అల్లాహు అక్బర్ అంటాడు. ముఖ్తదీలు నెమ్మదిగా తక్బీరు పలుకుతారు. ఆ పిమ్మట ఇమాం, ముఖ్తదీలు ఉభయులూ నెమ్మదిగా 'దరూదె షరీఫ్' చదువుతారు.

*అల్లాహుమ్మ సల్లిఅలా ముహమ్మదిన్ వఅలా ఆలి ముహమ్మదిన్ కమా సల్లైత అలా ఇబ్రాహీమ వఅలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్ మజీద్ అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదిన్ వఅలా ఆలి ముహమ్మదిన్ కమాబారక్త అలా ఇబ్రాహీమ వఅలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్ మజీద్.*

దరూదె షరీఫ్ పఠించాక ఇమాంగారు మూడవ తక్బీర్ 'అల్లాహు అక్బర్' అందరికీ వినబడేలా పలుకుతారు. ముఖ్తదీలు కూడా నెమ్మదిగా తగ్గుస్వరంలో తక్బీరు చెబుతారు. ఆ తరువాత ఇమాం, ముఖ్తదీలు ఈ దుఆ నెమ్మదిగా పఠించాలి. యవ్వనావస్తకు చేరుకొన్న శవానికి గాను అది స్త్రీదైనా పురుషునిదైనా ఈ దుఆయే పఠింపబడుతుంది.

*అల్లాహుమ్మగ్ఫిర్లీ హయ్యినా వమయ్యితినా వ షాహిదినా వ గాయిబినా వ సగీరినా వ కబీరినా వ జకరినా వ ఉన్సానా అల్లాహుమ్మ మన్ అహ్యైతహూమిన్నా ఫఅహ్యిహీ అలల్ ఇస్లామ్. వమన్ తవఫ్ఫైతహు మిన్నా ఫత వఫ్ఫహూ అలల్ ఈమాన్.*

కానీ శవం యవ్వనావస్తకు చేరని బాలునిది అయివుంటే ఈ దుఆ పఠించబడుతుంది. అల్లాహుమ్మజ్అల్హులనా పరతవ్‌ వజ్అల్హులనా అజ్రన్ వ జుఖ్రా! వజ్ అల్హూలనా షాఫిఅవ్‌ వ ముషప్ఫఆ.

యవ్వనం పొందని బాలికది శవమైయుంటే, దుఆ ఇలా పఠింపబడుతుంది. అల్లాహుమ్మజ్ అల్హాలనా ఫరతవ్‌ వజ్అల్హా లనా అజ్రవ్‌వ జుఖ్రవ్‌ వజ్ అల్హా లనా షాఫిఅతవ్‌ వ ముషఅప్ఫఆ.

దుఆ పఠించాక మామూలుగా ఇమాం బిగ్గరగానే ముఖ్తదీలు నెమ్మదిగా 4వ తక్బీర్ పఠించాలి. తక్బీర్ అయిన వెంటనే సలాము చెప్పాలి. తరువాత కట్టుకొన్న చేతులు వదిలేయాలి.

సర్వసాధారణంగా సలాం అయ్యాక ప్రజలు దుఆ చేస్తారు. ఈ పద్ధతి సరియైనది కాదు. శవం గూర్చిన దుఆ నమాజులోనే అయిపోయింది.

కొందరు తక్బీర్ చెప్పేటప్పుడు తమ ముఖం ఆకాశంవైపు ఎత్తుతారు. ఇది శుద్ధ తప్పు. కానీ ఇలా చేయటం వల్ల కంటిచూపు తగ్గే ప్రమాదముంది.

ఒకవేళ ఒకే సమయాన అనేక శవాలు చేరితే అన్నింటినీ ఒకదాని పక్కన ఒకటుంచి అందరికోసం ఒకే నమాజు ఆచరిస్తే చాలు. అయితే ప్రతి మృతుని జనాజా నమాజు వేర్వేరుగా చేయడం శ్రేష్టమైనది.

జనాజా నమాజు ఆరంభమయ్యాక ఎవరైనా నమాజులో పాల్గొన్నప్పుడు కొన్ని తక్బీరులు తప్పిపోవచ్చు. అతను ఇమాం సలాం చెప్పాక తన మిగిలిన తక్బీరులు పఠించాలి. ఎందుకంటే నాలుగు తక్బీరులు పలకటం ఫర్జ కదా!

ఏ ముక్తదీకి అయినా జనాజా నమాజ్‌లోని దు ఆ జ్ఞాపకం రాకున్నా లేక తెలియకున్నా లేక దరూదె షరీఫ్ వగైరాలు కూడా చదవలేకపోయినా కేవలం ఇమాం వెంట వుండి కేవలం నాలుగు తక్బీరులు మాత్రమే పలికితే అతని నమాజు నెరవేరుతుంది. ఎందుకంటే 4తక్బీరులు అయిపోయాయి. మరియు అవి ఉచ్ఛరించబడ్డాయి గనుక.

నమాజె జనాజాను (గాయిబానా) పరోక్షంగా నిర్వహించడాన్ని చాలా మంది ఉలమాలు స ,యైనదే అని అంటున్నారు. ఇలా అనడానికి ఆధా

రంగా వారు ప్రవక్త(స)వారు నజాషీ రాజు జనాజా నమాజును నిర్వహించిన సంఘటనను ఆధారంగా చూపుతారు.

అయితే మరికొందరు పండితులు, పరోక్ష జనాజా నమాజు సరియైనది కాదంటారు. నమాజె జనాజాకు శవం ఎదురుగా ఉండాలన్నది షరతు అని వీరి అభిప్రాయం. నజాషీ రాజు కోసం రసూలుల్లాహ్(స)వారు నిర్వహించిన గాయిబానా నమాజు గురించి ఈ పండితులు, అది కేవలం నజాషి కోసం మాత్రమే ప్రత్యేకింపబడినది'అని వాదిస్తారు. ఎందుకంటే నజాషీ ప్రవక్త(స)గారికి, అల్లాహ్‌కూ ప్రియమైన వ్యక్తి అని కూడా భావిస్తున్నారు.

అల్లాహ్ ఆదేశానుసారం ఖచ్చితంగా నజాషీ శవం ప్రవక్తగారి కళ్ళెదుటకు రప్పింపబడి వుండవచ్చు అని వీరి భావం.

ఎవరికేవిధంగా నచ్చితే దానిప్రకారం వారు నడుచుకోవచ్చు.

## సమాధి గావించుట (తద్ఫీన్)

శవాన్ని తొందరగా పూడ్చివేయాలి. అప్పుడప్పుడు ఖననవాటికకు శవాన్ని చేర్చిన తరువాత కూడా గొయ్యి తవ్వకం పూర్తిగాదు. ఇట్టి స్థితిలో గోరీని తవ్వడం పూర్తి అయిన తరువాతనే జనాజా నమాజును నిర్వహించాలి. అందుకు వ్యతిరేకంగా జనాజా నమాజు చేశాక గొయ్యి తవ్వటం మొదలెట్టకూడదు.

గొయ్యి మృతుని ఎత్తునుబట్టే తవ్వాలి. లోతు సగం ఎత్తుకంటే తక్కువ లేదా శవం లోతంత ఉండకూడదు. 'బగ్గీ ఖబర్' 'సందూఖీ ఖబర్' కన్నా శ్రేష్టమయినది.

శవాన్ని ఖబల్‌లోని ఖిబ్లా(పడమటి) వైపునుండి గోతిలోనికి దింపాల్సి ఉంటుంది. సమాధిలోనికి దింపేటప్పుడు 'బిస్మిల్లాహి వ అలామిల్లతి రసూలిల్లాహ్' అంటూ దింపుకోవాలి. స్త్రీ శవమైతే సమాధిలోనికి దింపే

టప్పుడు పరదాను పాటించాలి. గోతిలోనికి దింపే వ్యక్తులు ఆ మహిళలకు మహ్రమ్ (దగ్గరి బంధువు- అంటే ఎవరి ముందైతే ఆమె గోషాను పాటిం చాల్సిన అవసరం లేదో వారు ఉదా॥ భర్త, సోదరుడు, తండ్రి, పుత్రులు, తోబట్టు కుమారులు మొదలగువారు) అయివుండాలి.

సమాధిలో శవాన్ని పడుకోబెట్టాక శవానికి పైకట్టబడిన గుడ్డపేలికలు ముడులను విప్పాలి. శవానికి చుట్టబడిన గుడ్డల నుండి శవపు ముఖాన్ని తీసి ఖిబ్లా వైపుకు తిప్పాలి. ఆ పిమ్మట సమాధిని కర్రలేదా రాతిపలకలతో ఏటవాలుగా కప్పాలి. ఆ పలకలపై చాపలు, లేక చిరుచాపలు, మట్టిలోనికి పోకుండా ఉండేటట్లు బాగా కప్పాలి.

తరువాత గోతిని తవ్వగా వచ్చిన మట్టిని నీటితో తడిపి ముద్దలు చేసి దాంతో గొయ్యి మూతిని బాగుగా కప్పేయాలి. ఆ తరువాత దానిపై పొడిమట్టిని వేయాలి. మట్టిని వేసేటప్పుడు 'మిన్‌హా ఖలఖ్‌నాకుమ్ వ ఫీహా నుఈదుకుమ్ వ మిన్‌హా నుఖ్‌రిజుకుమ్ తారతన్ ఉఖ్రా పఠిస్తూ వుండాలి.

మట్టితో గోరీని పూడ్చేటప్పుడు శిరస్సు భాగం నుండి కప్పటం మొదలెట్టటం సున్నత్. ప్రతి వ్యక్తి కనీసం మూడేసి పిడికిళ్ళ మట్టిని వేయాలి. మొదటి పిడికిలి మట్టివేసేటప్పుడు మిన్‌హా- ఖలఖ్ నాకుమ్, రెండవ పిడికిలి మట్టి వేసేటప్పుడు వఫీహా నుఈదుకుమ్, మూడవ పిడికిలి మట్టివేసేప్పుడు వ మిన్‌హా నుఖ్‌రిజుకుమ్ తారతన్ ఉఖ్రా అని చదవాలి.

హాజరైనవారంతా మట్టివేశాక గోతిని తవ్వగా వచ్చిన పూర్తిమట్టిని గోతిలో వేసి గోరీని ఒంటె మూపురం లాగా మధ్యలో కాస్తా ఎత్తుగానూ, చివర్లలో క్రమంగా ఏటవాలుగా వుండునట్లు చూడాలి.

వీలైనంతవరకు శవాన్ని పగటిపూటే సమాధిగావించాలి. అయితే, ఆవశ్యకతను బట్టి రాత్రిపూట పూడ్చటంలోనూ తప్పులేదు.

ముస్లిం షరీఫ్‌లోని ఒక హదీసులో ఇలా ఉటంకింపబడి ఉంది.

ఒక సహాబీ(రజి)గారు మరణించారు. ఆయన సామాన్య బట్టలతోటే కఫన్‌చేసి రాత్రిపూటే సమాధిగావించబడ్డారు. రసూలుల్లాహ్ సల్లల్లాహు అలైహి వసల్లం వారికి ఈ విషయం తెలియగా, ఆయన(స)గారు ఇలా ఆదేశించారు. 'రాత్రిపూట ఎవరినీ సమాధిగావించకండి... మరీ గత్యంతరం లేని పరిస్థితిలో తప్ప...' అయినా నమాజె జనాజాను తప్పక ఆచరించాలి. మీ సోదరులకు కఫన్ (శవ వస్త్రధారణ) చేస్తే మంచి కఫన్ ఏర్పాటు చేయండి' అని.

దఫన్ అయ్యాక కొద్దిసేపు గోరివద్ద నిలిచి మృతుని ఆత్మశాంతి (మగ్ఫిరత్)కోసం దుఆ చేయాలి.

దఫన్ గోరి కట్టిన తరువాత ఒక వ్యక్తి సమాధి తలవైపున కుడిచెయ్యి ఉంచి అలిఫ్ లాం మీమ్ నుండి ముఫ్లిహూన్ వరకు, మరోవ్యక్తి కాళ్ళవైపు కూర్చొని ఆమనర్రసూలు.... నుండి సూరయె బఖరా చివరి వరకు పఠించాలి అని హదీసుల్లో ఉంది.

సమాధిగావించాక మృతుని సంబోధిస్తూ కొన్ని విషయాలు ఉపదేశించడం అహ్లెసున్నత్ వారి ఆచరణ. గోరి తలవైపు ఒక వ్యక్తి నిలుచొని మూడుసార్లు ఓ ఫలానావారి కుమారుడవు (లేక కూతురా) (పేరు పెట్టి పిలిచి) ఖుల్ లాయిలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్‌రసూ లుల్లాహ్. తరువాత ఖుల్ రబ్బియల్లాహు వ దీనిల్ ఇస్లామ్, వ నబియ్యు ముహ మ్మదున్ సల్లల్లాహు తఆలా అలైహి వస్సలం అని పఠిస్తారు.

## శోకం

చచ్చినవాని గుణగణాలు లెక్కిస్తూ దీర్ఘాలు తీసి ఏడుస్తూ శోక ప్రదర్శన చేయడం నిషేధించబడింది. ఏడుస్తూ, పెడబొబ్బలు పెట్టడం, బట్టలు చింపుకోవటం, మొహం రక్కుకోవటం, వెంట్రుకలు (జడ, కొప్పు) ఊడదీసి వెంట్రుకలు జారవిడుచుకోవటం, నెత్తిన దుమ్మెత్తి పోసుకోవటం,

ఎదపై గుద్దుకోవటం, కూర్చొని చీలమండలం నేలను రాయడం లాంటి పనికిమాలిన పనులు చేయటం గూర్చి ధార్మిక పండితులందరూ ఏకగ్రీవంగా నిషేధించారు.

శోక దినాలు మూడురోజులకంటే మించి పాటించడం సరైన పని కాదు, అయితే భార్య తన భర్త చనిపోతే నాలుగు నెలల పదిరోజులు శోకంలో ఉంటుంది.

కేవలం ఒకేఒక రోజు అంటే, ఏ రోజైతే మరణం సంభవించిందో ఆనాడు దగ్గరి బంధువులు లేక ఇరుగుపొరుగువారు ఇంటి జనాభాకు సరిపడా రెండు పూటలా భోజనం పంపాలి. ఆ భోజనం శవసంస్కారానంతరం భోంచేయాల్సి ఉంటుంది. కాని ఈ వంటకాలను అనుశోకం లేక ఊరడింపు కోసం వచ్చినవారు, ఆ ఊరూవాడలోని వారు తినకూడదు.

మృతుని ఇంటివారు మూడవనాటి జియారత్, దస్వాఁ, బీస్వాఁ, చాలీస్వాఁ (చహ్లుం), ఆరునెలల శోకం (ఛే మాహి) బర్సీ (తద్దినం లేక అబ్దికం)లంటూ బంధువర్గానికి పెద్ద ఎత్తున విందులు ఏర్పాటు చేస్తూ ఉంటారు. ఇవన్నీ నిషిద్ధమైన, అశాస్త్రీయమైన పద్ధతులు. అవన్నీ కల్పితమైన (బిద్అత్) ఆచారాలు. అపవిత్రమైనవి, నిందనీయమైనవీ అయిన ఆచారాలు. ఇదంతా కపటం, ప్రదర్శనాబుద్ధితో చేసే ఆచారాలే. ఈ దురలవాట్లనుంచి ప్రతి ఒక్క ముస్లిమ్ జాగ్రత్తపడి తన్నుతాను కాపాడుకోవాలి.

అయితే, ఆర్థికారాధన అంటే సదఖా, ఖైరాతులు, దానధర్మాలు చేసి, వాటివల్ల ప్రాప్తమయ్యే పుణ్యఫలాలను (ఈసాలె సవాబ్) అర్పించవచ్చు. కొందరు ఉలమాలు శారీరక ఆరాధనలు- నఫిల్ నమాజులు, నఫిల్ రోజాలు, ఖుర్‌ఆన్ పఠనం చేసి పుణ్యఫలాలను అర్పించవచ్చు అని అంటారు.

కానీ అజ్ఞానపు మూఢులు, ఒక కొత్తకుండను కొని, అందులో నీరు పోసి, దానిపై దుప్పటి కప్పుతారు. వంటకాలు చేసి ఫాతెహా ఇప్పిస్తారు. ఆ భోజన పదార్థాలను బంధుమిత్రులకు, గ్రామస్థులకు పంచిపెడతారు. ఈ పంపక ఫలితం చనిపోయినవారి ఆత్మ ఇల్లువిడిచిపెట్టిపోతుంది. అని నమ్ముతారు. ఇదంతా షిర్క్‌కు సంబంధించిన పనులు. శాస్త్రోక్తంకాని అజ్ఞానకాలపు మూఢాచారాలు.

ఐతే ఇంతక్రితమే పేర్కొన్నట్లుగా ఫాతెహా ఇప్పించటం మాని, ధాన్యం, దుస్తులు వగైరాలు పేదలకు బిచ్చగాళ్ళకు, అగత్యపరులకు, ప్రయాణాలలో చిక్కుబడినవారికి, అనాధ శరణాలయాలకు పంచిపెట్టడం ఉచితమైన పని. దానికని ఏదో ఒకరోజు లేదా ఘడియ ఏర్పాటు చేసు కోవడం ఎందుకు? వాటిని ఇష్టమొచ్చినప్పుడు చేయండి. దానధర్మాలను ఎడతెగకుండా చేస్తూనే ఉండండి. అందులో దోషమేమీ లేదు. చేయక పోయినా ఆక్షేపణ లేదు.

కానీ చనిపోయిన వ్యక్తి ఎవరికైనా ఏదైనా బాకీపడి ఉన్నాడా? తీసుకొన్న అప్పు తరలేదా? అన్నది గమనించాల్సి వుంది. బాకీ పడివుంటే వీలైనంత త్వరలో దానిని చెల్లించే ప్రయత్నం చేయాలి. ఒక ఉల్లేఖనాన్ని అనుసరించి మృతుని తాలూకు ఆత్మ అప్పు తీరనంతవరకు అంతర్ మధ్యంలో వ్రేలాడుతూ ఉంటుందని వుంది.

'సదఖా' 'ఖైరాతులు' చేసేటప్పుడు, చేస్తున్న దానధర్మాలు మృతుని సంబంధించిన సొమ్మునుండే చేస్తున్నారేమో అని గమనించండి. ఒకవేళ అదేగనక జరిగితే మరణించినవాని ప్రాజ్ఞతగల వారసులందరూ అందుకు అంగీకరించారా? లేదా? అనేది గమనించాల్సి ఉంది. లేదంటే- ఆ దాన ధర్మాలు చేయకపోవటమే మంచిది. ఐతే తమతమ సొమ్మునుండి ఎంత వీలైతే అంత పేదలకు పంచిపెట్టండి.

## ఊరడింపు

ఊరడింపు చర్య నబీకరీమ్(స)వారి సున్నత్. అంతేకాదు చాలా పుణ్య కార్యం కూడా. శవసంబంధీకులందరినీ- స్త్రీలు, పురుషులు, పిల్లలు, పెద్దలు అందరినీ ఊరడించడం ముస్తహబ్. (వాంఛించదగిన విషయం). ఈ సందర్భంలో ఓర్పును గూర్చి ఉపదేశించాలి. మృతుని తప్పిదాలను క్షమించమని అల్లాహ్‌ను వేడుకోవాలి.

-: సమాప్తం :-